# స్వప్నకథ

ప్రథమముద్రణము:
౧౦౦౦ ప్రతులు

గ్రంథకర్త:
జి. జాషువకవి
తెలుఁగు పండితుఁడు.
వినుకొండ

ఆనందంబునఁ జంద్రమండలమునం
దాసీనవై, యన్నముం
బానీయంబులు మాని, రాట్నమున
జ్యోత్స్నాసూత్రముల్ దీయు న
వ్వా! నీ కెవ్వరుఁ జుట్టపక్కములు లే
రా! సంశయంబయ్యె నా
కానీరేజవిరోధిలో నలువు నీ
వా? యిజ్జియా? మజ్జియా?

# అంకితము

అకట! తల్లాప్రగ్గడాన్వవాయసుధాబ్ధి
రాజు, శ్రీ సూర్యనారాయణాఖ్య
సుకవికిఁ గారాలసుతవై యుదయమంది
సిరిగలవారి మందిరము సొచ్చి
కనకంపుబొమ్మలఁ గల్పవల్లీ కమ
లాంబికలను కడుపారఁ గాంచి
వ్యాధిగర్భంబునం దదృశ్యవై, స్వీయ
కథ యెల్ల నొక స్వప్నకథ యొనర్చు
శ్రీ సింగరాజు లక్ష్మీకళావతిదేవి!
విధుమండలమున జీవించుచున్న
వృద్ధవనితను బోలి బింబింపవమ్మ
శాశ్వతంబుగ, నీదువంశంబునందు
ననుఁగుబిడ్డలయందు నీ కంకిత మిదు
స్వప్నకథయందుఁ గృతి కధిపత్ని వగుచుం

సహృదయులకు.

పోషించుదాతలు లేక వర్తమానయుగమునఁ గవితా కళ సన్నగిల్లినది. "నిరంకుశాః కవయః" అను సూక్తి కపార్థములను కల్పించి, వ్యర్థరచనలు సేయు బుద్ధిమంతులు బయలుదేరినారు. సమదృష్టి యుపన్యాసవేదికల కావాలితయై పోవుచున్నది. దుర్భరదారిద్ర్యము కవుల నాశ్రయించుటంజేసి యుత్తమకావ్యము లముద్రితములై మూలుగుచున్నవి. ధనవంతుల పసిఁడిసంచులు కారణాంతరములకు ఖర్చుపెట్టఁబడుచున్నవి. పరిస్థితు లెట్లున్నను రచనాకండూతికి గుఱియగు నాకల మూరకుండక స్వప్నకథను ప్రసవించినది. ఇక్కావ్యమున 'స్వప్నకథ,' 'అనాథ' యను రెండు కథలు కలవు. ఇందు మొదటిది సమగ్రము, రెండవ దసమగ్రము. ఒకటి మూటగట్టఁబడినగాలి, యొకటి సలసల గ్రాగి చిందిన కన్నీటిబిందువు. అసంపూర్ణమయిన 'యనాథ' కథ పాఠకులకు వింతగాఁ దోఁపవచ్చును. కాని, మనోగతభావము సమగ్రముగా వ్యక్తీకరింపఁబడినమీఁదట నాదృష్టి కిక్కథ సమగ్రము. అందువలన ననాథ పురవీథులలో విడిచిపెట్టఁబడినది. కావ్యశిల్పమునకన్న నభిప్రాయప్రకటనమే నాపరమావధి. సహృదయులకు నాయుద్దేశము స్పష్టము. వా రాదరించినఁ జాలును, తదితరులతో నాకుఁ బనిలేదు.

నా ‘ఫిరదౌసి’ కావ్యమును తమతండ్రిగారికిఁ గృతి యిప్పించి, పితౄణమును దీర్చికొన్న శ్రీ సింగరాజు మల్లపరాజారావుగారి కోర్కెపై వారి ప్రథమధర్మపత్నియుఁ గీర్తి మిగిల్చిచన్న పతివ్రతాశిరోరత్నమునగు శ్రీ సింగరాజు లక్ష్మీకళావతీదేవి కీకావ్యము నంకితము సేయుచున్నాను. ఆమెగారి యాత్మకును, కథానాయికల యాత్మలకును భగవంతుఁడు శాంతి నెలకొల్పుఁగాక.

గ్రంథకర్త.

# స్వప్న కథ.

ఉ. నే నొకనాఁడు స్వప్నమున
నింగికి రివ్వున లేచి, చంద్రబిం
బానికి దాపునం గనుల
పండువు సేయుచునున్న, వింత మై
దానమునందు వ్రాలి, పద్మ
దంబున దిక్కులు సూచుచుండ, నా
పై నునులేఁత వెన్నెలతు
పానులు వీచె మనోహరంబుగన్. ౧

కం. అచ్చెరువు పడుచుఁ బచ్చల
పచ్చికబయలునఁ జరింపవలె నని, తిరుగం
జొచ్చితి నవు డొక కమ్మని
యుచ్చైర్నాదంబు శ్రవణయుగళిన్ దాకెన్. ౨

ఆ. వె. ఇంద్రధనువువంటి హృదయంగమంబైన
వన్నెచిన్నె లీను వలువగట్టి
బాలుఁ డొక్కరుండు కేళి సల్పుచు నుండె
గాలిమబ్బుడోలికలఁ బరుండి. ౩

ఆ. వె. నన్ను రాచుకొనుచు నలువంకలకుఁ బారు
మెఱుపుఁదీవియలను నొరయుచున్న

వానిచక్కఁదనము వర్ణింపవలె నని
కలము నందికొంటిఁ గౌతుకమున. ౪

చ. అతఁడు, కికాకిక న్నగి, వి
యత్తలమెల్ల ధ్వనించిపోవ, స్వా
గతము కవీశ! ర మ్మిచటి
కొలువగట్టున నున్న రత్నరం
జితమగు నస్మదీయగృహ
సీమను నించుక విశ్రమించి, నీ
కత వివరింపుమం చెదురు
గా నట చెంగురు లల్లలాడఁగన్. ౫

కం. కలయో! నిక్కనమో! యను
తలంపు చిత్తంబునందుఁ దళుకొత్తఁగ, భూ
తలమునఁ బడియెదనో యని
యులుకుచు, గగనమునఁ దిరుగుచుంటి నతనితోన్. ౬

మ. మొలిచెన్ తెక్కలు మూపునం బులకరిం
పుల్ దేహమం దెల్ల శో
భిలె, మాధుర్యములైన భావములతో
విస్ఫూర్తిఁ బొన్నంగిపి
ట్టలతోఁ దేలికగాఁ జరించితి మఖండం
బైన వేగంబునన్

దలపై, ముత్తెపుగుత్తులట్లు గ్రహము
ల్దారల్ బ్రకాశింపఁగన్. ౭

గీ. గగనగంగమ్మ కవ్వలిగట్టునందు
దేవతలు స్నానమాడెడు రేవుపొంత
రాజహంసలపాదముద్రలు రహించు
నిసుకతిన్నెల వ్రాలితి మిద్దఱమును. ౮

ఉ. ప్రాకిన యేలకీ లతల
పందిటితోడ, సనాతనంపు నా
జూకుల కిక్కయైన యొక
సుందరసౌధముఁ జొచ్చి చూచినా
మేకులు రాట్నముం గలుగు
వృద్ధవిలాసినిఁ, బ్రాయ మంతయుం
జీకిన దాని, వెండి నగి
షీపనిదంపపుఁగట్లపీటపై. ౯

ఉ. చూపులు వాడిపోయినవి
శోభిలు దేహపటుత్వ మెన్నఁడో
కోపము సేసె, యౌవనముఁ
గూరికె నా యనువారు బిడ్డలుం
బాపలు లేరహో! తుహిన
మండల మెన్నఁడు సొచ్చియున్నదో

రోపికమాత్రిమే నిలిచి
యున్నది తోడయి గుర్తిగువ్వకుఁ. ౧౦

క. పదములచప్పుడు విని మా
కెదురు నడచివచ్చి మధురహృదయంబున న
వ్వది రెం డేడులబాలుని
వదనము ముద్దాడి విపులవాత్సల్యమునఁ. ౧౧

గీ. తేరఁగొనిచూచి పిలిచి, యాతిథ్య మిచ్చి
నాయనా రమ్మటంచుఁ జందనపుఁబీట
వయిచి భుజియింపుఁ డని నాకు బాలకునకుఁ
దామరాకులలో నమృతంబు వోసె. ౧౨

చ. ఎలమి నముద్రిపుం జిలుక
యాకల కుంచియుఁ బూని తాటిక
మ్మలభర మోపలేని జిగి
మాలినకర్ణము లూఁగియాడఁ గో
మలమగు జాజిపూవుల దు
మార మలంది చరించు లేఁతగా
డ్పు లోలయ పీచుచుండె నగు
మోమున సాదరవీక్షణంబులఁ. ౧౩

కం. మునలమ్మ చేతియన్నము
మెసవుచు బాలకునితోడ మెలఁగుచు నేదో

వ్యసనమునఁ జిక్కి మఱచితి
వసుంధరాతలము రెండుపదివాసరముల్. ౧౪

సీ. ముంజేత వడు వెన్నపూసముద్దలవంటి
మింటిచుక్కలతోడ మేలమాడి
మొగలిపుప్పొడివర్షమును బోలు తెఱచైన
పొగమంచు తెరల దోబూచులాడి
కటికిసంధ్యాగ్నిలోఁ గరఁగిపోవని క్రొత్త
స్వాతిమబ్బుగుఱాలసవారి జేసి
చదలేటినీట మజ్జనమాడు తెఱగంటి
రాచకన్నెలమీఁద రాలు రువ్వి

ఆ. వె. మంచువాలుచందమామమండలమున
నిల్లు మఱచి తిరుగు పిల్లవానిఁ
గ్రిమ్మరింప మూఁడుకాళుల ముసలమ్మ
తిరుగుచుండు నౌర! దినదినంబు. ౧౫

కం. ముక్కున నూపిరి నిలిచిన
దిక్కు దెసయు లేని ముసలితెఱవ హాసనమున్
జక్కనిగుణంబుఁ గనుఁగొని
యక్కజపడుచుండుఁ బ్రత్యహంబు నెడందన్. ౧౬

మ. ఒకనాఁ డగ్గలమైన వేగమున నే
యుం జీరలున్ రైక లిం

కోకఁనా డింపుడలిర్ప రాట్నమున దీ
యుం జందిరికాధారలన్
చికిలీజేసిన పట్టునూ ల్జిలుఁగువ
న్నెల్ గన్నులన్ దన్పు, దై
వికశక్తుల్ గల వృద్ధురాలికడ స్తం
భించుం దిశాగోళముల్. ౧౭

కం. అవగారి చిత్రచరితము
నవి స్తరముగా నెఱింగి చనవలెనని, దూ
ది వడుకునమయంబునఁ జే
రువగాఁ గూర్చుంటి నొక్కరో జుదయమునన్. ౧౮

చ. కరమున దూదిపింజలు, మొ
గంబున నవ్వు దుఱంగలింప, న
న్నరసి, "విశేష మేమి? కొడుకా!" యని
తీయఁగఁ బల్కరించినన్
జరణము లంటి మ్రొక్కి, "దివసంబులు
పెక్కు గతించె, నేను చం
దురునిపొలంబుఁ జేరి, కృపతో నను
గ్రమ్మరఁ బంపు మవ్వరో!" ౧౯

ఉ. నీవు మహాత్ము గల్గినమ
నీషిణి, వెన్ని యుగాలు దాటె న

హా! వనజారిలోకమున
వాసము సేయఁదొడంగి, యెవ్వరీ
భావుకుఁ? డాప్తులుం గులము
వారు గలారొకొ? మర్త్యకాంతవో
దేవతవో వచింపు మని
తీయనిపల్కున హెచ్చరించితిన్. ౨౦

క. ముగ్గినపండగు నమ్మది
వగ్గది విని రెండు మూఁడు బాష్పకణంబుల్
నిగ్గుడిగియున్న చెక్కులు
డిగ్గెన్ గాద్గదిక సంఘటిలిన యెలుఁగునన్. ౨౧

గీ. నా వయస్సెంతొ చంద్రమండలము వయసు
నించుమించుగ సరిపోవు నెంచిచూడ
నాచరిత్రంబు నిన్నమొన్నటిది గాదు
యెన్నియుగములు దాటిపోయెనో కుమార! ౨౨

సీ. ఆకాశరామ నీళ్లాడుచక్రదనాల
బుడుతచుక్కల కెల్లఁ బురుడువోసి
అలవోక నిండు జాబిలి రాట్నములమీఁద
మేలైన వెన్నెలనూలు వడికి
విభునిదుర్దశఁ జూచి విలపించురోహిణీ
నారీవతంసంబు నూఱడించి

గ్రహణకాలమునందుఁ గలుషితంబై పోవు
నుడుపతిప్రుట్టంబు లుదికిపెట్టి

గీ. ప్రసవవేదనఁబడు వేల్పుఁజడతుకలకు
పీనమిగిలిన మంతరసాని నగుచు
సమవసకుఁగూడఁ గన్నమూయను కుమార!
కవులు వర్ణించు జింకను గాను నేను. ౧౩

ఉ. ఏను పరోపకారమున
కే తను వెల్ల వ్యయించినాను, అ
జ్ఞానులు దాచుకొందురు తృ
ణాత్మణకర్కశ త్రైలయంత్ర మె
వ్వానిబలంబుఁ బిండ దాక
పక్షమున న్నశియించు చంద్రుఁడుక్
మానునె? విశ్వలోకసద
నానికి సున్నముఁగొట్టుచేతలక్. ౧౪

ఉ. నే నొక రెడ్డిసానికి జ
నించినమానవకాంత నన్న నా
దీనచరిత్రలోన నిన
దించురసంబు విషాద మందులో
నానినగుండెతోడ గగ
నంబున కెక్కితిఁ, జావు లేదు నా

మేనికిఁ జంద్రమండలన
మిద్ధసుధాశనకారణంబునన్. ౨౫

క. జననీజనకులు నేఁ బోడ
మిన రెండవవారమున నె మృత్యువునకు భో
జనమై, చనినారే నవు
డనాథ నయి గుడిసెలోన నలచుచునుంటిన్. ౨౬

గీ. తల్లిదండ్రులఁ జంపిన దానవి యిది
యాదరించిన నేమి ప్రమాద మగునొ
యనుచుఁ గొఱకొఱలాడి నన్నంటరయిరి
పౌరకాంతలు; భీతి గొప్పది గదన్న! ౨౭

గీ. పదిదినాలకుముందు గర్భమునఁ బండి
నిదురవోయిన చిన్నారి నిర్మలాత్మ
యాఁకఁటం దూలు ప్రత్యేకవ్యక్తి యయ్యె
పాంచభౌతికమైన దేహమునఁ జొచ్చి. ౨౮

గీ. గుడిసెకొప్పున నెన్నఁడో గూఁడు గట్టి
డాఁగుకొనియున్న కొండొఁకనాగమయ్యె
వాని డాపునఁ బెట్టిన తేనెపట్టు
ముట్టితో నొత్తెఁ గ్రొందేనె లుట్టిపడఁగ. ౨౯

క. వా యెండ నేడ్చునా కా
తీయనిమధురసము కంఠదేశంబున నా

ప్యాయముగఁ గురియ రోదన
నేయుట మానితిని కొంత నేను కుమారా! ౩౦

క. కాలముచేసినతల్లి, త
దాలయమున నాగమయ్యై నిలిచెనో! కా
కీలాటి వింత గలదే?
వ్యాళములకు మానవులకు వైరంబు గదా! ౩౧

చ. గరిపెడు పాలు నాచియుత
కంఠమునం దిడువారు లేకపో
యిరి కొడుకా! యనుంగుఁజన
యిత్రి దివంబు నలంకరించినన్
గరుణకుఁ దావలంబగు నో
కానొక పేదకుటీరమందు నేఁ
బెరిగితి రెండునాళ్లు విల
పించుచు సర్పము పిండుతేనెలన్. ౩౨

మ. ఒక రే యాకలి దీరి యంగకములం
దుల్లాస ముప్పొంగ, నూ
రక మింటిం గని నవ్వుచుంటి నతిజీ
ర్ణంబైన మాయింటిలో
నికి లేవెన్నెలచేతులం జానిపి నా
నిగ్గుంగపోలంబు లం

టి కృపాశీతలదృష్టులం బుడుకుచుండెం
జందు్రఁ డానందుఁడై. 33

చ. శిరమున నున్న రత్నమణి
చెమ్మగిలం బడగెత్తి యాడుచుం
దిరుగుచునుండె మండలగ
తి న్ననుఁ బెంచినపాపతల్లి మం
దిరముకొనన్ సమస్తధర
ణీవలయంబును గాఢనిద్రలో
గుటకలు వెట్టుచుండెఁ బసి
కూనమనంబువలెం బ్రశాంతమై. 34

మ. అలరుంబొన్నల నున్న దంపతులగా
ఢాశ్లేషణం గంది వె
న్నెలపన్నీటను దావ మార్చుకొనుచుం
డె న్మందవాతూలముల్
నెల మావేదకుటీరమస్తమున నా
నెన్ బాదముల్, రెండు జా
ముల యీ డేర్పడియె న్నిశాసతికి భీ
ముండయ్యెఁ గాముండునన్. 35

ఉ. ఎప్పుడు కన్నుగూర్కితినొ!
యే నపు డింకొకలోకమందు నా

యవ్వరయు నంబయు న్నను బ్రి
యంబునఁ గౌఁగిటఁ గ్రుచ్చి కన్నులన్
జిప్పిలు బాష్పపూరముల
చే నభిషేక మొనర్చి, యేదియో
చెవ్పాట వింటిఁ దత్తుహీన
శీతలదృష్టులఁ దేలిపోవుచున్. ౩౬

గీ. కాచగోళంబులో దీపకళికవోలి
కంటి కగుపించుచున్నది కడువుఁజిచ్చు
వేయి వచియింపనేల నకొ్కయమందు
నాస్వరూపంబు లేని స్థానంబు లేదు. ౩౭

గీ. తనివిదీరక ముద్దాడుతల్లిగారి
యమృతమయమూర్తి నాకుఁ బ్రత్యక్షమయ్యె
నాకుటీరంబు, నారూపు, నా యుదేల
దిక్కుదెసలేని నా ఘోరదీనదశయు. ౩౮

మ. పరలోకంబున దేహము న్మఱచి, స్వ
ప్నస్వల్పసంతోషమే
దురితస్వాంతతఁ దల్లియంకతలమం
దు న్నిల్చియున్నట్టినా
సరదా బూడిదపాలుగా, గుడిసెప
జ్జన్ దెక్కలల్లార్చి, కు

కుక్కురుకో యంచును గోడి కూసి నను మే
ల్కొల్పెన్ వికారధ్వనిన్. ౩౯

గీ. ఉదయసూర్యునికిరణంబు లొక్క టొకటి
నాకుటీరంబుకప్పు కన్నములనుండి
పసిఁడితీవెలవలెఁ జొచ్చి వ్రాలుచుండె
సలలితములైన తల్లిచూపులవితాన. ౪౦

గీ. కడుపుపండిన యొకసాలెపడఁతిమిన్న
ప్రియముతో నన్నుఁ గొనిపోయి పెంచుకొనియెఁ
దనదు సంతాన మనెడు ముత్యాలమాలఁ
గొలికిపూసనువలెఁ జూచికొనియె నన్ను. ౪౧

క. ఇంతంతదాననై భగ
వంతునికృపఁ జపలశైశవంబుఁ గడచి ని
శ్చింతంబు నమలసుమనః
కాంతంబగు బాల్యదశను గడచితి నంతన్. ౪౨

చ. మిసమిసలాడు యౌవనము
మేలిమిబంగరువన్నె మేనికిన్
బొసఁగె గులాబిబుగ్గలకుఁ
బోఁడిమిహెచ్చె నలంక్రియక్రియా
వ్యసనమునందుఁ జిక్కి మగ
వానిసమత్తుముఁ గాంతు సేసితిన్

గుసగుస ముచ్చటల్ వినుట
కున్ మనసయ్యె రహస్య మేటికిన్. ౪౩

గీ. చణకుచణకున దోణికి నిస్వనము సేయు
జలభరితమైన బిందె బుజానఁ బెట్టి
యువకులకుఁ గోర్కు లూరఁ గొండొకదినమున
నచ్చపుటొయారమున నీరు దెచ్చుచుంటి. ౪౪

చ. తిరిపెఁపుఁగూటికై బడుగు
దేహము నీడిచికొంచు వీథులన్
దిరిగెడు పేదవాఁ డొకఁడు
దృష్టిపథంబున గోచరించినన్
గరుణ వహించి, యాతని మొ
గంబు నెగాదిగఁ జూచి, గేహమున్
మఱచి, పసిండి విగ్రహము
మాదిరి చేష్టలు దక్కి నిల్చితిన్. ౪౫

గీ. వాని మోమునఁ గలదైన్యభావమునకు
కఱఁగిపోయిననాగుండె కాయనుండి
పై కుబికివచ్చు కన్నీటివఱదలోన
నోలలార్చితి నానిల్చియున్న నేల. ౪౬

ఉ. కాఱు మొయిళ్లు గ్రమ్మిన మొ
గంబునఁ జేదఱికంబుముద్ర చె

న్నారఁ బునాదు లూడినవ
యన్నన్నఁ గంచము చేతఁబట్టి యా
హారముకోసమై తిరుగు
నాముసలయ్యకటాక్షముల్ నిరా
శారుచిరంబులై, పలుక
సాగె దయాంకితభావగీతముల్. ౪౭

గీ. ఒకఁడు చిన్నమ్మకరడోల నూగుచుండ
నొకఁడు పెద్దమ్మకటికిదృష్టికిఁ దపించు;
ప్రకృతిజనయిత్రి యనుఁగుగారాలసుతుల
నొకని ద్వేషించు నొకని నభ్యుద్ధరించు. ౪౮

క. చిన్నప్పటినుండియు నా
కన్నా పరులకష్టములను గని యోరువలే
దన్నా! బడాయిగా దీ
వెన్నెల నాకనుల నుద్భవించుచునుండున్. ౪౯

క. నాసౌందర్యశ్రీలకు
దాసుండై కట్టుపడ్డ తరుణుం డొకఁ డా
శ్వాసించు నెవముతోడ
న్నాసన్నిధి కరిగి, చిన్నినవ్వులు గురియున్. ౫౦

గీ. 'రాజవీథిని శృంగారరసము లొలుక
జలముఁ గొనివచ్చువట్టుగాజులపడంతి

మోదుగుంబువ్వమట్లు నెమ్మొగము గంద
దుఃఖపడియెద వేల హేతువులు లేక? ౫౧

సీ. బాలాతపంబు చుంబనము గావింపని
చిఱుతబుగ్గలు సొమ్మసిల్లిపోయె
పసుపుఁబూఁతలతోడఁ బనిలేక శోభిల్లు
చిన్నారి మేన ముచ్చెమట వోసె
వడుచువారికి రాయబారంబుఁ బంపించు
కన్ను లశ్రువు లూరి చిన్నవోయె
ప్రణయదేవత కాపురము సేయఁ దగియున్న
వదనలావణ్యంబు వట్టిపోయె

ఆ. వె. దర్శనీయమైన త్వద్విలాసమునకు
ముజ్జగంబు మంత్రముగ్ధమయ్యె
జలభరమున నీ భుజంబుగుఁ గ్రింగఁ దోడంగ
బిందె డింపుమందు వే లతాంగి!' ౫౨

క. అనిపలుకరించు యువకునిఁ
గనుఁగొని కనుగొనక యోరగాఁ దొలఁగి గృహం
బున కేగుదెంచి, విషయము
జనయిత్రికిఁ జెప్పి నాఁటి సాయాహ్నమునన్. ౫౩

గీ. నేను వడికిననూలు మగ్గాన దార్చి
తల్లియనుమతి నర్ధరాత్రమున నేను

సత్వరంబుగ నాటుగజాల బట్ట
నేసి యొసఁగితిఁ బేదవానికిఁ గుమార! ౫౪

గీ. నాఁడుమొదలుగ నాభోజనంబునందు
సగము నిరుపేద కిడి తక్కసగముతోడ
జీవనము సేయుచుంటి, నా జీవితంబు
సార్థకం బయ్యెనని పురజనులు వొగడ. ౫౫

ఆ. వె. నన్ను బెంచునతివ కన్నసంతానంబు
వాసికెక్క నన్నుఁ బగ వహించి
గాసిపెట్టసాగెఁ గాలక్రమంబున
మారుతల్లి దివికి జారిపోయె. ౫౬

ఆ. వె. ఆ యసూయ పెద్దదై యక్కసెల్లెండ్రు
ఇల్లు వెడలనడిచి రేమి సెప్ప
బిచ్చగానితోడ భిక్షుకురాలనై
యుండలేనిదాన నయితి నన్న! ౫౭

క. ధనవంతుఁడు దొంగభయం
బునఁ దల్లడ మందినట్లు పురవిటనిచయం
బునకుఁ దలంకితి నెఱజ
వ్వనమునఁ దులదూఁగు మందభాగ్యఁ గుమారా! ౫౮

గీ. పాప మీశీలవతి కెంత పాటు వచ్చె
ననుచు నొకనాఁడు రెండునాళ్లచట నిచట

నన్నముం బెట్టి కొందరు మిన్నకుండి
రంతియు కదన్న! మనుజుల యాదరింపు? ౫౯

చ. మిలమిలలాడు మేనిపయి
మృత్తిక చేరుకొనెఁ, బ్రసూనకో
మలత నశించె, వస్త్రములు
మాసి క్రిమంబుగ జీర్ణమయ్యెఁ, జూ
పుల నిశితత్వముం బలుకుఁ
బొందిక తొంటియొయారపున్నడల్
దొలఁగె, దరిద్రదేవికృప
లో నొకలోపము లేకపోవునే? ౬౦

క. హెచ్చినయాకఁట బ్రతికెయుఁ
జచ్చినగతిఁ జూపఱుల కసహ్యముగఁ బురిఁ
బిచ్చం బెత్తెడు ననుఁ గని
పిచ్చిదనుచుఁ బేరుపెట్టి పిలిచిరి పౌరుల్. ౬౧

క. సుకములకు దూరమై కూ
టికి గుడ్డకు రోసి తల్లడిలు వేళను మా
నక పోషణఁ జేసితిఁ గా
టికిఁ గాళులు సాచు నక్కడిందిదరిద్రిఁ. ౬౨

గీ. లేమిచేఁ గందిపోయిన నామనస్సు
నందు సంతృప్తి తాండవ మాడఁదొడఁగె

విలసితము లైన కలిమిలేములనుగూడ
కడలు పరికించునెడల సౌఖ్యంబు గలదు. ౬౩

క. ఓరంతపొద్దులును బరి
చారికవలె మునలివానిచరణంబులు వే
సారక భజించు న న్నొక
జారిణి యని తలఁచి నింద సలిపిరి లోకుల్. ౬౪

క. ఇతఁడుం బండ్లూడిన పెను
ముతుకం డిది ముద్దరాలు పొసఁగదనక యి
ట్లతికించుచుండ్రి లోకులు
సతులకుఁ బురుషులకు నోటిచాపల్యమునన్. ౬౫

గీ. స్వాంతము నెఱుంగు దుర్భిణీయంత్రములను
నలువ సృష్టించియున్న మానవునిజిహ్వ
యనృతమును సృష్టిసేయునా? యవకతవక
గమన ముండున? భువనచక్రమున కిట్లు. ౬౬

సీ. ఒకలేమ కసరి కుక్కకుఁ బోలి పులిసిన
పిడికెడెంగిలికూడు విసరివేయ
ఒకతల్లి సహజధార్మికురాలు కరుణించి
కమ్మని కూరలుం గబళ మేయ
ఒకచుప్పనాతి పెట్టకపోయకయ నోటి
కండూతిఁ బరుషవాక్యములు పలుక

ఒకకుటుంబిని నన్ను నికటానఁ గని యింటఁ
జొరఁబడి గడియవైచుకొనియుండ

ఆ. వె. ఒక్కనాఁడు గుడిచి యొకనాఁడు పస్తుండి
నెత్తికొంగుమీఁద నిదురవోయి
ముసలివానితోడ మూఁడేండ్లు కష్టాంత
నాటకంబు నడపినాను నేను. ౬౭

ఆ. వె. పేదతీకము పెద్దవింతచదువులబడి
దానిలోన లజ్జ గానఁబడదు
ఉదర మొజ్జ యగుచు నోరంతపొద్దులు
నోర్మి విద్దె నేర్పుచుండు నచట. ౬౮

క. 'అబలను దరిద్రురాలను
కబళం'బని యొక్కయింటికడ నిలిచితి బా
డబు లున్నవాఁడ నొకనాఁ
డబలామణి యోర్తు రాజహంసనడకతోఁ. ౬౯

ఉ. గుమ్మము సేరవచ్చి పలు
కుంబులకండము గుమ్మరించుచుఁ
'గొమ్మ! మొగంబు తామరస
కోరకముంబలె నీదు లేఁతప్రా
యమ్ము వచించుచున్నది క
టా! జవరాల వినుంపగజ్జలు

న్నమ్మలకుఁ జిక్కినావు మహి
పాంగనకుం జిగురాకుపోలికన్. ౭౦

చ. ఋణము లొనర్చి, నాదు మగఁ
డీలిగె నాకనుపించు నాలుగం
కణములమిద్దె బచ్చులమొ
గంబునఁ బెట్టితి నద్దెకొంపలో
మిణుకుచు సొమ్ము లమ్ముకొని
మెక్కితి నిన్నటిదాక దేహధా
రణ మెటుసాగునో? విధవ
రాలను బిడ్డల కేమి పెట్టెదన్? ౭౧

గీ. దానకండూతి గలుగుహస్తంబు నాది,
పేదవారికి లే దనలేదు నేను,
బిచ్చ మిడలేని నారిత్త వేడియూర్పు
లందుకొన్నావు మందభాగ్యవు, నిజంబు.' ౭౨

మ. అని కంటన్ దడిపెట్టు నయ్యతివసా
మ్యస్వాంతమున్ గూలిపో
యినసంసారచరిత్రమున్ బరులకే
దే నీయన్నై లేమియుం
దును నిట్టూర్పు నిగుడ్చు దానగుణ మా
దుర్దాయు నామానసం

స్వప్న కథ

బున నానందవిషాదమేఘపటలం
బుల్ దీర్చె గాఢంబుగన్.

క. 'నీ కన్న మందభాగ్యు ల
నేకులు గలరమ్మ చూచితే లోలాక్షీ !
యాకుల మాకుల మన' కని
యాకారము లేనియంతరాత్మ వచించెన్.

ఉ. ఆమెపదాల వ్రాలి నిట
లాంచల మంట నమస్కరించి సా
ధ్వీమణి ! మందభాగ్యులగు
పేదలవ్రాతఫలంబుగాక నీ
ధామము లేమి దేవతకుఁ
దావలమౌనె? ప్రశాంతిదీపమం
దాముద మింకునే? పరహి
తార్థుల కిట్టివిపత్తు మూడునే?

గీ. అనుచుఁ గన్నీటిపలుకుల ననునయించి
నా గడించిన నాలుగణాలడబ్బు
ప్రియముతో భావనమ్మ కర్పించుకొంటి
జన్మము తరియించె నని చిత్తశాంతిఁ గంటి.

శా. ఈడుల్ జోడును లేనిసంపదల నూ
రే లూఁగు సంపన్నులన్

మూఁడంతిస్తుల మేడ గట్టుకొని సం
తోషించుచున్నట్టి మా
శ్వాడీవర్తకుఁ డొక్కరుండు మును నా
వాల్చూపుగాయాలచేఁ
బీడింపంబడువాఁడు నావదనమున్
వీక్షించి గుర్తించుచున్. ౭౨

ఉ. అక్కట! సాలెవారిజవ
రాలవు గావొ లతాంగి! నీవు? నీ
చక్కఁదనంబుఁ దొల్లిఁటివు
జా! యెటు వోయె? బజారులోన నీ
చిక్కనివాలుఁజూపులు ర
చించిన తుమ్మెదతోరణాలలో
నుక్కిరిబిక్కిరై సొగయు
చుండెఁగదా! మగవారిచిత్తముల్. ౭౩

క. కడలేని కాలవాహిని
నుడిగుండము లెన్ని గలవొ! చూచినవాఁడున్
వడిదుడుకు లేక బ్రతుకుం
బడవ నడుపుకొనినవాఁడు వసుధం గలఁడే? ౭౪

క. అని తొంటి కొద్దిపరిచయ
మున నాయెడ నింత సానుభూతి నెఱపి త

ద్ధనవంతుఁ డాదరంబున
దినవెచ్చం బీయ సమ్మతించె ముదమునన్. ౮౦

గీ. ధనికుఁ డిడుచుండు దినవెచ్చమును గ్రహించి
పేదపడియున్న బ్రాహ్మణవిధవ కొసఁగి
కోరి వృద్ధునిఁ బోషించుకొనుచునుంటి
నలువురిండుల భిక్షాటనంబుఁ జేసి. ౮౧

ఉ. ఏ నొకనాఁడు భిక్షుఁ గొని
యింటికి వచ్చితి నర్ధరాత్రి లేఁ
డానడలేనివృద్ధుఁడు గృ
హంబున నాతనిచింపిగుడ్డలున్
వానిపదాంబుజంబులను
వాయని తాతలనాఁటి చెప్పులున్
గానఁగనయ్యె ముంతయును
గంచముఁ జింతిలుఁబందులుం బలెన్. ౮౨

క. అందందు వెదకిచూచితి
నెందు నతనిజాడ లేమి హృదయము వగులన్
గ్రిందంబడి పొరలుచు నా
క్రిందన మొనరించితిని మొగంబుం గందన్. ౮౩

శా. శ్రేణుల్ గట్టిరి పౌరు 'లేమిటికి జ
చ్చెన్ వృద్ధుఁ డేమయ్యెనే

ఏణీలోచన! తచ్ఛ్రవం' బనుచుఁ,
ద్వృత్తాంతముఁ జెప్పినన్
'జాణా! వృద్ధునిఁ జంపితే' యని యను
ష్టస్వాంతులై తిట్టుచున్
రాణాకుం గొనిపోయి రిద్ద, రది గూ
డం బాడియా నెంచినన్. ౮౪

ఉ. ఆ చెఱసాలజాలకము
లందుఁ బ్రసన్నముఖాంబుజంబునన్
దోఁచి, కటాక్షమాలికల
తో నభిషేకముఁ జేసి ప్రేమపూరు సంఖ్య..
చాచతురత్వ ముట్టిపడ
సాంత్వనముల్ వచియించుచుండు న
బ్బాచులతేనివంటి శుభ
మూర్తి యొకండల వృద్ధునాకృతిన్. ౮౫

క. తాతా! యెందుంటివి? నా
యాతనలకుఁ బారమున్నదా? యని, చింతా
ఘాతమున నలిగిపోయిన
చేతంబున నఱచి, సొమ్మసిల్లిపడుటయున్. ౮౬

గీ. ఘంటఁ గొట్టిన లీల నాకర్ణయుగళి
మోగుచున్నది దేవతామూర్తిగళము

స్వప్నముం గాదు జాగ్రదవస్థ నున్న
నాకు వినవచ్చె వక్ష్యమాణంబుగాను. ౮౭

క. దీనులపాలిఁటిభాగ్యని
ధానమ! నాతల్లి! నీసుధాజీవితగా
ధానవ్యకుసుమసురభిళ
మై నాహృదయంబు స్వర్గ మానందించెన్. ౮౮

చ. మొలిచినయౌవనంబు వృథ
పుచ్చి, దరిద్రుల దేబెరింపుచూ
పులను గఱంగి, స్వీయసుఖ
ముం బలియిచ్చినమచ్చికంటి! చిం
తిలవల దూఱడిల్లుము వి
నిర్మలమైన భవచ్చరిత్రలో
వెలసిననిందలన్ దుడిచి
వేయును కాలము సత్యబద్ధమై. ౮౯

గీ. కోరుకొనుమమ్మ! తల్లి! నీ కొంగునిండ
వరము లిచ్చెద నని సమీపమున నిలిచె
మూఁడుగాళులముసలయ్య గాఁ డతండు
బ్రహ్మతేజస్వి! యొక వేల్పుఁబడుచువాఁడు. ౯౦

గీ. కలుషగర్భితమైన భూవలయమందు
నేను జీవింపలే నరనిముసమయినఁ

డావకపదాబ్జములసన్నిధానమునకు
నన్నుఁ గొనిపొమ్మనుచుఁ బల్కినానో లేదో! ౯౧

చ. ఒకనుడిగాలి రివ్విన మ
హోద్ధతి నాకడ వీచి, నన్ను మిం
టికిఁ గొనివచ్చి చంద్రధర
ణీ న్నిముసంబున నిల్పిపోయె, న
ర్భకుఁడయి నన్నుఁ దన్పుచు న
వారిగ నాపరిచర్య లందు న
య్యైకలుషమూర్తి తొంటిమున
లయ్యె సుమా! యనుమాన మేటికిన్. ౯౨

క. అని కథ ముగియించినతోఁ
డన రాట్పుత్రుఁడు పుటపుటం దెగిపోయెన్
గనువిచ్చి చూచినంతన
దినకరమండలము తూర్పుదిక్కున నవ్వెన్. ౯౩



# అనాథ.

గీ. పరులదుర్గతిఁ గని గుండె గఱఁగి వగచు
సదయహృదయులవీక్షణాంచలమునందుఁ
బుట్టుచుండును కన్నీటిబొట్టు వోలె!
ఏఁడి భగవంతుఁ డని సంశయింతు వేల?

# అనాథ

ఉ. అన్నముఁ బెట్టవే యనుచు
నల్లరిసేయుననుంగుబిడ్డలన్
దిన్నగ నూరడించుచు వి
ధిం దలపోయుచు నొక్కపేదరా
లన్నముఁ దిన్న కొండొకథ
నాథ్యుని బంగరుమేడముంగిటన్
దిన్నెల వేగుచుండె నతి
దీనత మున్నొకనాఁటిరాతిరిన్. ౧

ఉ. ఏతలి కన్నదో! వ్యథల
నీడుట కీనిరుపేదరాలి న
న్నాతికి బిడ్డ లార్వురు తి
నంగల తెక్కలు రానివారు, రం
జీతని యెంచెనో నలువ
సేయువిలాసమొ! చంటిబిడ్డయున్
మ్రొతఁ దగిల్చుచుం
బురుడువోసిననాఁడ గతించె భర్తయున్. ౨

గీ. అతఁడు పోయినవెనుకఁ బిత్ర్యమగుధనము
జోలెయును నంచి ద్వారకె నిల్లాలి కయయొ!
బిడ్డలా సోదరులు చంటిబిడ్డ యొక తె
యెట్లు పోషించు? నెటువోవు! నేది దిక్కు? 3

గీ. అధిక దైన్యంబు మోముల నధివసింప
నడచుపీనుంగులో యనఁ గొడుకుఁగుఱ్ఱ
లామె వెనువెంట నడువ గ్రామాంతరంబు
వాసి వచ్చిన దొక యమావాస్యనాఁడు. ౪

ఆ. వె. ఒడలిమీఁదిబట్టయును నత్తుగాజు లా
బోగురాలియాస్తి భోగ మెల్ల!
నేడుపొట్ట లింక నేరీతి నిండునో
బ్రతుకు లెట్లు తెల్లవాఱఁగలవో! ౫

ఉ. 'నాయనలార! మీకడుపు
నం గల యాఁకఁటిచిచ్చు లార్ప నా
కాయముదక్క గవ్వయును
గల్గదు నాకడఁ దెల్లవాఱినం
బోయి గడించి తెచ్చెదను
బోనము నోఁపికపట్టుఁడయ్య! అ
మ్మాయికిఁగూడఁ బాలు కఱ
వైనవి, యన్నములేమి నాకునున్.' ౬

ఆ. వె. అనుచు నురలివచ్చు నశ్రుబిందువులను
దుడిచికొనుచు జంటిబుడుతదానిఁ
జిచ్చికొట్టుచుండె క్షితిమండలం బెల్లఁ
గునికి నిద్రవోవు కుటిలరాత్రి. ౭

క. ఉప్పరము నీలియద్దపుఁ
జిప్పవలెం గనటువోయి, చెన్ను వహించెన్
గప్పురకప్పురచీకఁటి
తెప్పలపై నింక నావరించుచునుండెన్. ౮

ఉ. విచ్చినమల్లెపూవువలె
వేకువ యయ్యె, ద్విరేఫఝుంకృతిన్
మచ్చరకించు రాట్నపుని
నాదము లొప్పె, గళుక్కు లుక్కు మం
చచ్చట నిచ్చటం జిలుఁగు
టందెలు మ్రోయ జలంబు దెచ్చుచున్
ముచ్చటలాడు నూరినన
బోఁడులసందడు లయ్యె నయ్యెడన్. ౯

మ. పదియారేఁడుల నిండుజవ్వనము లా
వణ్యంబు మిట్టాడ ను
న్నది లే దన్నప్రశంసకెక్కి, పిడికిం
టన్ జిక్కుమధ్యంబుతో
బెదురుంజింకకనుంగవం గలుగు త
న్వీరత్న మాయింటికు
జ్జది, చూచెం గలయంపిఁ జల్లుచు వసా
రాయం దనాథాంగనన్. ౧౦

శా. ఓసీ! యెవ్వతె వీవు? నీమగనిసా
మ్మున్నట్లు పాపిష్ఠురా
లా! సంసారము బెట్టినావు మొగసా
లన్ లేచిపొమ్మంచు నా
దాసీన్యంబుగ మాటలాడి, జలపా
త్రీన్ గాలితోఁ దన్నినన్
గానంతేనిఁ గలంక కయ్యబల సం
తానంబు వెంటాడఁగన్. ౧౧

గీ. కదలి, చనుదెంచి, వీథివృక్షములనీడఁ
గూలఁబడి తూలుచుండెఁ గొడ్కులును దాను
అంత నొకబుద్ధిమంతురా లాదరిద్ర
మూర్తులం జూచి, కరుణించి, ముదలకించి. ౧౨

ఆ. వె. ఓసి పేదరాల! యూర నేఁ డొకగొప్ప
పెండ్లి గలదు, నీకు బిడ్డలకును
గడుపునిండ బువ్వ గల, దాగృహస్థుండు
పెట్టుపోఁతలందు వెలితిపడఁడు. ౧౩

ఆ. వె. చలిది గలదు రమ్ము సంతానముం గూడి
వ్రిస్తుతంబు తూత్తు వాపుకొనుము,
బాలు రక్కటకట తూలుచునున్నారు
అన్న మెప్పు డింత తిన్నవారొ! ౧౪

క. ఆకలిదప్పులు దీరెను
నీకమ్మనిమాట విన్న నిర్మలహృదయా!
లోకంబునందు నెల్లఱు
రాకాసులవంటికఠినురాం డ్రుండెదరా? ౧౫

చ. చుఱుకుచుఱుక్కనం బలుకు
సూదులు గ్రుచ్చి యదల్చి కావునం
దరి జలకుండికం గ్రొబదమునం
బడదన్నినచేఁత చిత్తముఁ
గలఁకఁ గోయఁగా నయిన
గాయము మాన్చె భవన్మృదూక్తి త
ల్లిరో! యెవరింటఁ బుట్టితివి?
లేమలలో నను నుద్ధరింపఁగన్. ౧౬

మ. అనుచుఁ గన్నుల నీరుగ్రుక్కుకొని య
య్యైతావులన్ జుత్తునన్
గనులుం బొట్టలు గ్రుంకి దీనముగ నా
క్రందించుసంతానముఁ
గని, తల్లీ! చనుదెమ్ము నీసుతులభా
గ్యం బంచునుం బోయి వే
కొని తెచ్చెం బులిగూడు భిన్నటము నా
కుంభోత్తులం గొంగునన్. ౧౭

గీ. కడుపు మనిచెప్పి బంగారుగుడులు గట్టి
పెట్టుచుందురు నరులు నై వేద్యములను
సృష్టికర్తకు, దాని భుజింపఁ డతఁడు
భిక్షుకునిచేతి యెంగిలిపిడచ గాక. ౭౮

క. అది యారగించి, పేదల
యుదరంబులు చల్లఁబడియెనో లేదా! నభ
స్సదనమునఁ దిరుగుమేఘము
లుదరంబుల నించికొనియె నుదధిజలంబుల్. ౭౯

సీ. ఏనుంగుచెక్కిళ్ళపై నివాసము సేయు
కన్నుమిన్నెఱుఁగని గర్వమునకు
కరుణాలవం బెఱుంగని క్రోలుపులినోట
వర్ధిల్లు క్రూరస్వభావమునకు
అత్తపత్తిదళంబులం దుట్టిపడుచున్న
నినుముట్టరాదను నియమమునకు
పురివిచ్చియాడు నెమ్ములకంఠమునఁ దోఁగు
కలదు నాకను నహంకారమునకు

గీ. గండుటలుకలవత్రిత్యంగకమున నలరు
పరులకొంపలు దినివేయు స్వార్థమునకుఁ
జిక్కువడకున్ననిరుపేద బక్కదాన!
కరుణ కిరవైనదాన! స్వాగతము నీకు. ౮౦

చ. కినియుచుఁ బొ్రిద్దు నెత్తిపయి
కిం బయనించినదాక, భూమిక
య్యాను బవళించి, పొంత నడ
యాడుచుఁ బాడుచు నున్న కూర్మినం
దనులను ముద్దులాడుచు ము
దంబునఁ దేలుచుఁ, బొద్దుపుచ్చుచుం
డను తరుకోటరంబున న
టించెడుపక్షుల నొక్కపక్షియై. ౨౧

గీ. వంగనామాలు నుదుటఁ దుఱంగలింప
పట్టువంచెలు బొజ్జలఁ బరిహసింప
భోజనమునకు బిరబిరఁ బోవుచున్న
విత్తవంతుల నరసె నప్పేదరాలు. ౨౨

మ. ఎడగాఁ బొమ్మని చీదరించుకొనువా
రీవంక నావంక నొ
త్తిడిసేయం గర మెత్తి మ్రొక్కుచు మహా
దీనంబుగాఁ బ్రొక్కకన్
బుడుతల్ దానుఁ దొలంగుచుం బెదరుచుం
బుత్రీసమేతంబ కా
అడవిన్ దాటినయట్లు కష్టమున ర
థ్యల్ దాటి శీఘ్రంబుగన్. ౨౩

క. పెండిలిగీముం గని క
ట్టెండ కచట నున్న నింబవృక్షముకడఁ గూ
ర్చుండెం గొడుకులతోఁ బెను
గండము గడచినవిధంబుగాఁ గరుణముగాన్. ౧౪

ఉ. త్రొక్కుడుబండిపై నడక
క్రొత్తగ నేర్చినపోకిలా యొకం
డెక్కడనుండియో యచటి
కేగుచు నంకెకురాని భార్యతో
జిక్కుల నందుభర్తవలెఁ
జేతులపట్టుఁ దొలంగి వ్రెల్మిడిన్
ముక్కున నెత్తురొల్కఁ బడి
పోయె గుభిల్లునఁ బేదరాలిపై. ౧౫

చ. ముసలిది చచ్చె చచ్చె నని
మూఁగిరి కొంద, ఱతండు క్రుద్ధుఁడై
కసరుచు లేచి కన్నులకుఁ
గావరమా? యటఁ జావకుంటివా?
పసరము! యంచు రక్తమునఁ
బైవసనంబు మునుంగుచుండగా
విసుగును సిగ్గు నాన్యమున
వ్రేల గమించుచునుండె వీథులన్. ౧౬

క. పిల్లలు 'గీ బే' యనుచును
గొల్లున రోదింపఁ గట్టుకోక రుధిరపు
న్వెల్లువను మునుఁగ నల్లన
నల్లాడుచు లేచెఁ బేదరాల్ రాల్గరుగన్. ౨౭

ఉ. ఏఁడు సముద్రముల్ గడచి
యెక్కడ నేపనిమీఁదఁ బోయి యు
న్నాఁడవురా! పరాత్పరుఁడ!
నాకడగండ్లకు మేర యున్నదా?
యేడకుఁ బోవుదాన? నెటు
లీకనుగందులపొట్ట నించు నీ
యాఁడు దటంచు నేడిచె మ
హాకరుణంబుగ డొక్క క్రుంగగన్. ౨౮

క. అక్కడ నిలిచినవారల
నొక్కండును నేల కొఱఁగియున్నవడఁతిపై
నక్కటిక మూని ముట్టరు
దిక్కుదెసయు లేనివారిస్థితి యింతే కదా? ౨౯

చ. అట నొకమేడపై నరన
మూడుచు దంపతు లిద్ద రప్పుడ
చ్చట గుమిగూడియున్న జన
సంఘము నారసి, పృచ్ఛ నేసి, యూ

రటపడి, క్రమ్మరం బ్రణయు
        రాజ్యవిహారము సేయఁజొచ్చి ర
క్కట! సుఖ మొక్కచోటఁ గడ
        గం డొకచోటఁ గదా వసుంధరన్ ! ౩౦

క. పరమేశువిలాసమ్ములు
కరము దురూహ్యములు, శిశువు కాయమునందున్
జిఱుగాయమేని లే కతి
సురక్షితముగా హసించుచుం బడియుండెన్. ౩౧

గీ. ఓయి! నాస్తికుఁడా! విను మొక్కమాట
అరసియుందువు ఘోరదృశ్యంబు నిచట
మృత్యుదేవత కోఱలు మొఱయునపుడు
శిశువు నేమహాశక్తి రక్షించెనోయి! ౩౨

సీ. పరువెత్తివచ్చుపర్వతమాలికలవంటి
        జలధిభంగముల నవ్వలికి గదిమి
బ్రహ్మాండగోళంబుపైఁ బ్రయాణము సేయు
        నినబింబమును తూలనీక నిలిపి
పెళపెళార్భటుల మర్త్యులమీఁది కుఱికెడు
        పిడుగుల నోరగా విసరివయిచి
సృష్టిలో నొకచిన్నిచీమ కాలము సేయు
        పొడమినకన్నీట మునిఁగి తేలి

గీ. గడియ తీరిక లేక లోకమును గావ
పరువులిడుచుండు దీనులపాలివాఁడు
నిజకరాబ్జంబు నీచిట్టినిసుగుమీఁద
నిలిపె నొకనిమేషం బది నీ వెఱుఁగవు. ౩౩

ఉ. చేరువ నుండి యప్పుడఁతి
చేటు సమస్తముఁ జూచుచున్నసం
సారులలో నొకండు కడు
జాలి వహించి భిషక్కునింటికిం
జేరిచి యండ నుండ నొక
ని న్నియమించి చికిత్స సేయగా
నారువరాలరొక్కము ని
రాకులుఁడై యిడె వెజ్జుదోసిటన్. ౩౪

క. ఓ లలన! నీమగం డొక
మాలది పడిపోవ నంటి మైలవడియె వై
ద్యాలయముఁ జేర్చినాఁ డిఁక
నీలాగున నయినఁ గుడియు నెడమయు లేదా! ౩౫

గీ. ఎవ్వరికి లేనిపుణ్యంబు నితఁ డొకండె
నాచికొనివచ్చెఁగాఁబోలు నాతిమిన్న!
యెవరికర్మము వారిది నీ వెఱుఁగవా!
ముక్తి గలుగునె మాలలఁ బులిమికొనిన? ౩౬

ఆ.వె. అనుచు నమ్మలక్క లతనియిల్లాలికిఁ
ద్రాపి రెలమిఁ గ్రోధరసము నబల
శివము పట్టినట్టు చిందుద్రొక్కుచునుండెఁ
బ్రకుపితోగ్రశంభురాణి వోలె. ౩౭

క. గంగను మునిఁగినభక్తుని
యంగంబుల నోలలాడునానందం బు
ప్పొంగెడునెదతో నదనము
ముంగిట నడుగిడినభర్త మోముం గనుచున్. ౩౮

క. రావలన దింటిలోనికి
నావల నిలుచుండి స్నానమాడు మనుచుఁ గ
న్నైవల నదరులు గురియఁగ
నావెలఁది వచించె విభు ననాదరణమునన్. ౩౯

చ. ఇది యొకక్రూరురాలు ఇవు
డేసు వివాదము పెట్టుకొన్నచోఁ
బదుగురు నన్నుఁ దిట్టి, తల
వంపులు సేయుదు రూరకుంట యి
య్యదనున నుత్తమం బని, ని
జాంగన నిల్పినచోట నిల్చి కో
విదమతి, స్నానలీల నెఱ
పెం గులభేదపిశాచతృప్తికై. ౪౦

గీ. భోజనముఁ జేసి కేలఁ దాంబూలమంది
పోకచెక్కలు రెండింటి బుగ్గ నునిచి
చిఱుతరతనాలపీట నాసీనుఁ డగుచు
నింతి నాహ్వాన మొనరించి మృదులఫణితి. ౪౧

చ. 'అలుక శమించెనా? జలక
మాడినయంతనె? మాలదానిపి
ల్లలకడగండ్లు నూఁచి బహు
ళంబుగఁ దప్తము నందు నామనో
జలజము మైలపడ్డ దది
స్నానము చేసెనె? వెఱ్ఱిదాన! యీ
వెలుపలిశుద్ధి జీవులకుఁ
బెట్టునె? పోయునె? ముక్తినిచ్చునే?' ౪౨

క. స్నానము సంధ్యావందన
మేనాఁడో! మఱచినాఁడ విప్రుఁ డీవు కిర
స్తానులలోఁ గలయుటకొఱ
కా నీతులు సెప్పుచుంటి? వనుచు విముఖయై. ౪౩

చ. కరుగిడునల్లత్రాచువలె
భామిని క్రీడ సంచలింపఁగా
శిరము మరల్చి లేచి నిర
సించుచు ముంగిఁటి కేగె, నంత నా
నరసుఁడు కోపగింపక, వి
చారము సేయక, స్వీయకార్యత

త్పరుఁ డయి లేచిపోయెఁ; బెడ
వాదన సేయరు నీతికోవిదుల్. ౪౪

క. తనపనులు మాని మరునాఁ
డనాథశరణాలయంబునందు విడిచె న
య్యనదకుమారులఁ; గరుణా
వననిధులకుఁ బరహితంబు పబ్బంబు గదా? ౪౫

గీ. మేనిగాయంబు లలనల్ల మానిపోవ
వసతి కాలక్రమంబునఁ బట్ట గట్టె;
వసుధపై నూక లున్నసంపన్నుఁ డెంతో
బడుగు పేదయు మృత్యుదేవతకు నంత! ౪౬

క. ఒకయరుణోదయమున భి
క్షుకుఁ బోవుచునుండ నిండుకౌతుకమతులై
పకపక నవ్వుచు మూగిరి
స్వకుమారులు చుక్క లూడిపడినవిధమునన్. ౪౭

ఉ. పోయినప్రాణముల్ మగుడఁ
బొందినిఁ జొచ్చినలీలఁ దండ్రిరా
రా! యని కౌగిలించుకొని,
యాసమెయిం గడు ముద్దులాడి, తా
నీయెడ నామోదం బికిర
మొత్తిన రొక్కము నాటుదమ్మిడీ
లాయమ పంచియిచ్చె హృద
యంబును బంచినలీల వారికిన్. ౪౮

క. అన్నము నరిపోవునె ? నా
కన్నకొడుకులార ! విసిఁగి కసరుకొనరుగా
చిన్నిసహోదరు ? నచ్చట
నున్నమహామహులు చూతురో మిమ్ము దయన్ ? ౪౯.

క. జగడములు బెట్టుకొనకుఁడు
వగఁగుందిన నాదరించువా రెవరన్నా ?
యుగచాల్ల నందు నడవీ
నుగు నే నుండుదునొ చత్తునో ! సుతులారా ! ౫౦

క. అని పెద్దకొడుకు కడుపునఁ
దనశిరమును నిలిపి కొంతతడవు వగచి రం
డని పిలుచు చదువులయ్యాను
గని చేతులు మోడ్చి, బాష్పగంగాముఖయై. ౫౧

ఆ. వె. వీరు దిక్కులేనివారు పంతులుగారు!
ప్రేమతోడ నాదరింపవలయుఁ
గూలి నాలి జేసి కొంత శక్తికొలంది
ముట్టఁజెప్పుకొందు ముందు కనుచు. ౫౨

క. చరణముల నంటినం గురు
వరుఁడు కనికరించి దుఃఖపడవలదు సతీ !
పరమేశ్వరుండు లేఁడా ?
నరుండు నరు నుద్ధరించునా ? వెఱిదానా ! ౫౩

చ. లలన! యొకమ్మ పెట్టు కబ
ళంబు భుజించుచు మందభాగ్యవై

నలువురియిండ్లపంచల ది
నంబులు బుచ్చెడు నీబహూకృతుల్
వలయునె ? తప్పును మ్మిటులఁ
బల్కుట; వర్ణన కందరాని బి
డ్డలవయి నున్న మోహ మక
టా! పలికించు ననేకరీతులన్. ౫౪

క. బారెడుపొద్దెక్కిన దిఁక
రా రం డని పిలువ బిరబిరం జెలియలితోన్
నూరారుముద్దు లిడి చని
రూరు వెడలి బాలు రంబయుం జనుదేరన్. ౫౫

చ. "ఇది పొలిమేరరాయి, జన
నీ! యిఁక నిల్వుము రేపటెండయు
మ్మొదమునఁ గందిపోవును సు
మా! మనచిట్టిది, వచ్చిపోవుచుం
డెద" మని, పెద్దవాఁడు దయ
నీయముగా వచియింప, శోకవా
రిదము వెలార్చు బొమ్మనిబి
రీసతరంగితగండభాగయై. ౫౬

చ. చినిగినపైఁటకొంగు నొక
చేతఁ దనూజశిరాన నుంచి, నం
దను లెడమైన నిరీక్షణప
థంబును దాఁటినదాకఁ జూచి, పె

చ్చనిహ్ళాదయంబుతో నడువ
సాగె ననాథ పురంబువంకకుఁ
గనుల మెఱంగుబిడ్డలవి
కాసముఖంబులు నంస్మరించుచుఁ. ౫౭.

ఉ. వచ్చనివన్నెతోఁ జిగురు
బట్టి పసందులు నింద నాలిగా
ద్భుచ్ఛలితంబు సేయఁ దల
లూచుచు నున్న పొలాలు దాటి య
య్యచ్చఁపు జోగు లాలు పుర
మల్లనఁ జొచ్చి కుమార్తె నెత్తి పా
లిచ్చుచుఁ గూరుచుండె నొక
వృక్షమునీడ క్షుధాకులాంగియై. ౫౮

సీ. ఎవఁ డారగించు నమృతభోజనంబున
గలిసెనో యీ లేమ గంజిబువ్వ
ఎవఁడు వాసము సేయు శృంగారసౌధాన
మునిఁగెనో యిన్నారిపూరిగుడిసె
ఎవని దేహముమీఁదిధవళాంబరములలో
నొదిగెనో యిన్నాతిముదుకపంచె
ఎవఁడు దేహము సేర్పు మృదుతల్పములలోన
నక్కెనో యీయమ్మకుక్కిపడక.

గీ. వసుధపై నున్నభోగసర్వస్వమునకు
స్వామిత వహించి మనుజుండు పరిభవమందు

నెవఁ డపహరించె నేమయ్య నీమొసుఖము
కలుష మెఱుఁగని దీనికొడుకులసుఖంబు? ౧౯

క. ఉఱుములు మెఱుములు గలయొక
శరదము గగనమున మసలి క్షణకాలమునన్
గురిసెం బ్రచండవర్షము
నిరులు గవియ మన్ను మిన్ను నేకముగఁగతిన్. ౨౦

క. జడివాన గురియులోపల
నడువీథికి నడచి మనయనాథ శిశువుతో
గడగడ వడఁకుచు నొకచా
వడిలోనికిఁ బోయి నిలువఁబడియె బెదరుచున్. ౨౧

ఆ. వె. వానలోనఁ దడిసివచ్చిన పెంపుడు
కుక్క కుపచరించునొక్కపురుషుఁ
డాగ్రహించి పంచ నంటుకొన్నావఁటే
యరుగు మరుగు మనుచు నాదరించె. ౨౨

ఉ. ఈ పసిబిడ్డతోడ నిపు
డేడకుఁ బోయెదనయ్య! యిచ్చటన్
గాపుర ముందునా? యుదయ
కాలమునుండియుఁ బచ్చిగంగ లే
దోపిక జారె నీసుకృత
మూరకపోవునె? వర్షమాగని
మ్మో పరమోపకారి! యని
యూపిరి కన్నుల నిల్పి పల్కినన్. ౨౩

క. కనికరపు మొలఁక లాతని
యనాదరణ మలమియున్న యంతఃకరణం
బునఁ బొటమరింప నిష్టము
ననిష్టమును దెలుపుమాన మతఁడు వహించెఁ. ౬౪

గీ. అతని పెండ్లాము కరుణారసార్ద్రహృదయ,
నాథునకు లేనికొన్నిసుగుణములు గలది
మంచి కుమ్మరైనయాఁడుది మాటకారి
యదియునుం గాక చదువుకొన్నదియుఁగూడ. ౬౫

క. మెడ దిరుగనిసొమ్ములతో
వడి వంకయు లేని హసితవదనముతో సం
దెడుకొప్పుతోడ మదనుని
పిడియేనుఁగువోలి వచ్చి ప్రియవచనములన్. ౬౬

క. ఎవ రైననేమి? రక్షణ
మవశ్యకర్తవ్యమే కదా! నరులకు, ధ
ర్మమునకును గలుగునే కుల
వివక్షతయుఁ జిన్నపెద్దభేదము నాథా! ౬౭

గీ. అని మనోహరునుల్లంబు కనికరింప
మధురమధురంబుగాఁ గొన్ని మాటలాడి
పేదరాలికి భోజనభిక్ష పెట్టి
ప్రేమ వర్షించె, నాఁటి వారిదముకరణి. ౬౮

గీ. మగఁడు గొట్టిన రోదించి మానుకొన్న
పెద్దగయ్యాళివలె వాన వెలిసిపోయె
మమత లుడిగినసన్యాసిమనసువోలె
గగనమండలం బెల్ల నిష్కలుష మయ్యె. ౧౯

సీ. ఆకటం దూలు సస్యశ్యామలక్షేత్రి
కన్య గడుపు చల్లగా భుజించె
బక్కచిక్కినకొండవాగుం దటాకంబు
జిలుకలో నుప్పొంగి చియ్యబట్టె
ముమ్మాఱయిముత్యంబువోలి తామరమీఁద
వర్ష బిందువు తాండవంబు నేసె
వడయాడురతనంబు వడువున నాడాడ
ఆరుద్రపురువు బ్రత్యక్షమయ్యె,
గీ. చెలఁగి చేయార దానంబు జేసి చేసి
కొఱత వడియున్నవానికాపురమువోలి
యుబ్బసెడి తూలె నొకచిన్నిమబ్బుతునుక
యుత్తరంబుగ దిక్కుల కొత్తిగిల్లి. ౨౦

